# శ్రీనివాసకల్యాణం

రచన:

కాటూరి వేంకటేశ్వరరావు




ప్రచురణ:

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1997

# SRINIVASA KALYANAM

by

**Katuri Venkateswara Rao**

T.T.D. Religious Publications Series No. 189



T.T.D. First Edition : 1984
Reprint : 1997

Copies : 2,000

**Price : Rs. 6-00**

Published by:
M.K.R. Vinayak, I.A.S.
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati -- 517 507.

Printed at:
Raja Printers,
Bangalore -- 560 027.

# ముందుమాట

తెలుగు వాఙ్మయంలోని వివిధ విభాగాలలో శ్రీనివాసుని ప్రశస్తికి సంబంధించిన అంశం ఏ రూపంలో లభ్యమైనప్పటికీ అది విశిష్టతను సంతరించుకున్నదైతే దానిని స్వీకరించి, తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించి అందుబాటులోకి తీసుకొనిరావడానికి నిరంతరం కృషి సల్పు తూనే ఉంది. అందులో భాగంగానే యక్షగాన రూపంగా వెలువడిన ఈ శ్రీనివాస కల్యాణాన్ని ముద్రించడం జరుగుతోంది.

ఈ యక్షగానాన్ని ప్రసిద్ధ కవులు కీ॥శే॥ కాటూరి వేంకటేశ్వరరావుగారు రచించారు. ఇది 'ఆకాశవాణి'లో ప్రసారానికిగాను, ఆధునిక అభిరుచులకు అనుగుణంగా రచించబడింది. అయినప్పటికీ ప్రాచీన యక్షగాన సరళి నుండి వైదొలగకుండా ఈ రచన సాగింది. కాటూరివారు దీనిని శ్రవణ ప్రాధాన్యంతోపాటు ప్రదర్శనానుకూలంగా కూడా ఉండేటట్లు సరస మనోజ్ఞంగా రచించారు. శ్రీ వేంకటాచల మాహాత్మ్యంలోని శ్రీనివాసకల్యాణ వృత్తాంతాన్ని సుకుమారంగా మలచుకుంటూ కవితామాధురితో స్వామివారి కల్యాణ వైభవాన్ని సుందరంగా దిద్దితీర్చి ఆవిష్కరించిన అక్షరరూపం ఈ యక్షగానం!

ఈ యక్షగాన ప్రథమముద్రణ రసజ్ఞులైన భక్తజనుల ప్రశంసలనందుకొన్నది. అందువల్ల ఆ ప్రథమ ముద్రణనే యథాతథంగా తిరిగి ముద్రించి పాఠకుల ముందుంచుతున్నాం. శ్రీ వేంకటేశ్వరుని కల్యాణ వైభవాన్ని, కాటూరి వేంకటేశ్వరరావుగారి రచనా మాధురిని ఆస్వాదించగలరని ఆశిస్తూ.

కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



# శ్రీనివాస కల్యాణం

నమోఽస్తు శ్రీనివాసాయ శేషశైలవిహారిణే
వందారుసురబృందాయ భక్తాభీష్టప్రదాయినే॥

నాట రాగము - రూపక తాళము

నాలుకపై నిలువరావె నలువరాణి శుకపాణి ॥
ఏలికవై నిగమాగమ జాలములకు ప్రణవపీఠి
నోలగ ముండేటి తల్లి పాలింపవె కృపావల్లి ॥నాలుకపై॥

అని యిష్టదేవతా ప్రార్థనం బొనర్చి ...

సూత్రధారుడు

ఎవరయ్యా, భాగవతులు! ఏమిటి విశేషం ?

కథకుడు

భాగవతులంటూ పెద్దపేరు పెట్టకండి, బాబయ్యా, మాది విజయవాడ, ఆకాశవాణీ సామాజికులం. శ్రీ వేంకటేశ్వర స్వామికి కైంకర్యంగా శ్రీనివాసకల్యాణం అనే యక్ష గానం వినికి చేస్తునాం

సూత్రధారుడు

బాగుంది కాని, గ్రంథకర్తపేరు చెప్పావు కావు.

కథకుడు

కాటూరి వేంకటేశ్వరరావుగారని...

సూత్రధారుడు

అలాగా! వేంకటేశ్వర కల్యాణమూ, వేంకటేశ్వర రచనమూ నా?
సరే. కానీండి, విందాము.

కథకుడు

అని యిష్టదేవతా ప్రార్థనం బొనర్చి, సాక్షాద్వైకుంఠుడైన కేశవదేవుండు శేషాచలమ్ముపై నవతరించిన కథాక్రమం బెటువలెను—

ద్విపద

అజు డాదికల్పమ్మునందు విశ్వమ్ము
సృజియించి, ఒక పవల్ చెల్లిన యంత
నిదుర గూరినవేళ నీరధుల్ పొంగె
చదల పన్నిద్దరై సవిత వెలిఁగె
ప్రళయ మేఘము లంబరమ్మున దోచె
చలపట్టి ఏడుగాడ్పులు వెస వీచె;
ఏకార్ణవమ్ములో నీ ధాత్రి యపుడు
తేకువ నెడి మున్గి దెసమాలియున్న;
కనకాక్షుడనెడి రక్కసుడు భూదేవి
గొనిపోయి పాతాళమున విహరింప,
హరి వరాహాకృతి ధరియించి, దనుజు
హరియించి, కోరకొన ధరణి గొని తెచె.
భూకాంతపై ప్రీతిబూని శ్రీశుండు
వైకుంఠమునకేగు వాంఛ విడనాడి,
అటనున్న క్రీడాద్రి నవనిక చేర
పటుసత్త్వుడగు ఖగపతి కాజ్ఞయిచ్చె.

సూత్రధారుడు

ఎలాగూ ! వైకుంఠంలో ఉన్న పర్వతాన్నే పెకలించి
తెమ్మన్నారా భూవరాహస్వామివారు ?

కథకుడు

ఆహా

కందార్థం

అంతట గరుడాళ్వారు అ
నంతజవమ్మున వికుంఠమందలి గిరి వి
క్రాంతి పెకలించి నిజబా
హాంతరమున దాల్చి తెచ్చె నంబరవీథి.
అది గని అమరు లక్కజమందీ
పదువులై బళిబళిర బంగరు
నగముపై నీలాద్రియని వెను
దగిలి కనుగొన తాల్చి తెచ్చె నంబరవీథీ !

సూత్రధారుడు

ఏమి చిత్రమంటేనూ!

కథకుడు

పుష్కరిణితో కూడా క్రీడాద్రిని గరుడాళ్వారులు ఇలా
పెకలించే సరికి ...
చెలులతో జలకేళి సలుపు రమాదేవి
తత్తరమ్మున సరస్తటము జేరి
బంగారు వలువల చెంగులు జీరాడ
నంబరమ్మున కలహంస లట్టు
లెగురగా, గతివేగవిగళత్సరోజపం
డము బాసి అళిసమూహములు సలుపు
నులివు పక్షక్షేపముల తాళగతి గూడి

సంగీత వీణలు సవదరింప
కనక కమలపరాగసంక్రాంతి భూన
భోంతరమ్ములు పటికార్చినట్టి పైడి
నిగ్గుల వెలుంగ, బుష్కరిణీ సమేత
మైన క్రీడాద్రి తెచ్చె విహంగపతియు.

ఇట్లు తెచ్చిన క్రీడాద్రి నా భూవరాహదేవుండు శేషా చలమ్ముపై విడియఁజేసి, అందున్న పుష్కరిణికి పశ్చిమ తటంబున విశాల మంటపోపేతంబైన దివ్యాలయంబు వస తిగా, తన్ను జేరవచ్చిన శ్రీనీళాదేవులంగూడి, దంష్ట్రాగ్ర ధృతవసుంధరాసమేతుండై, సుఖంబుండె. ఆ గిరి వారా హగిరి యనియు, గరుడుండు కొనితెచ్చిన కారణంబున గరుడాద్రి యనియు ఇట్లనేక కారణంబుల ననేక నామంబులు ధరించియుండు.

సూత్రధారుడు

ఇకనేం, వరాహదేవుని కోనేరు గనుక వారాహపుష్కరిణి అనేపేరు వచ్చింది.

కథకుడు

ఆ వారాహ పుష్కరిణి కలికలుషహరంబై విరజానది తుల్యంబై యుండు.

సూత్రధారుడు

బాగుంది, కాని, శ్రీనివాసవృత్తాంతం చెపుతానని మొదలు పెట్టి భూవరాహస్వామి కథ చెప్పేవు; అంతేనా!

కథకుడు

ఇదిగో, అదీ మనవిచేస్తాను కాదూ! ఆ భూవరాహదేవుండు...

వారాహపుష్కరిణీరమ్యతీరకా
నసభూములఁ దరావనజనేత్ర
గవగూడికొని, యిష్టకామోపభోగ కే
ళీ వినోదమ్ముంతో విహార
పరవశుడై, పెక్కువత్సరమ్ములు పెను
మక్కువం గడపుచు నక్కధరము
విడలేక యందుండి, విధిముఖామరగణ
పూజలందుచు, దానవులను వెదకి

వేటలాడి తున్మిమూటాడి. జగము ని
ష్కంటకమ్ము సలుపు సమయమందు
వృషభదనుజు సంహరించెడి పనిబూని
అరిగె నెటకొ భూమిధరము దొరగి.

భగవంతుండగు హరి యిట్లు శేషభూధరమ్ము విడిచి చనినంత, చతుర్ముఖుండా వృత్తాంతం బెరింగి. హరి లేమింజేసి భూలోకం బింక అధర్మవాదులకు బరహింసారతులకు నెలవై చెడుంగదే యని భయమంది సకలలోకసంచారియైన నారదు రావించి, శ్రీహరి మరల భూమి నవతరించు నుపాయంబుగావింపు మనినంత — ఆ యాజ్ఞ తలం దాల్చి.

సూత్రధారుడు

అలా చెప్పు! ఇంకా నారదుడు రాలేదేమా అని చూస్తున్నాను

శంకరాభరణ రాగము - జంపె తాళము

కథకుడు

వేలుపుల జడదారి వెడలె మినుదారి ॥
మేళవించిన మహతి గాలితాకుల సరిగ
మాలాపనము సలుప హరి రమారమణయని
వేలుపుల జడదారి వెడలె మినుదారి ॥

పావన గాంగతీర వనవాటికలకా మునికోటి యజ్ఞ దీ
క్షావిధినున్న చో దరియగా జని, "ఓ మునివర్యులార ! మీ
రీ వివిధాధ్వరమ్ముల యజించెద రెవ్వని? తత్ఫలంబు గౌ
రీవరుఁడో, రమేశుడో, విరించియొ, ఇంద్రుడో ఎవ్వ డందెడిన్?

తెలుపరే" యనినంత; కశ్యపాత్రిభరద్వాజముఖ్యులగు మౌనులు
తమలో గొంతవడి గుజగుజలు వోయి, తుదకు త్రిమూర్తులలో
యజ్ఞఫలార్హు డెవ్వడో యెరింగి రమ్మని భృగుమౌనిం బ్రార్థింప
అతండు తొలుత సత్యలోకమ్మునకేగి,

ద్విపద

ఏకాంతమున శారదాకాంత గూడి నా
ళీకభవు డున్నచో, రాక యెరిగింప కా
జటి వరుడు నికటమున తటుకుమని నిలువగా,
కుటిల భ్రుకుటి మొగము లటు ద్రిప్పికొనె నలువ
భృగుమౌనియు నీతండు రజోవశుండై, నన్ను మన్నింపడాయె.
యజ్ఞఫలార్హుండు కాదగ డనియు, నీతనికి భూమియం
దాలయంబు లేకుండుగాక యనియు నిశ్చయించి,

ద్విపద

భృగుమౌని కైలాస నగమునకు నేగి,
అగజతో నేకాంతమందున్న శివుని
దరికేగ, తరిగానితరి నంతిపురికి
జొరబారిన త్రిదండి నరసి గిరిపుత్రి
నానమై వంచికొనె నాననమ్మంత
మౌని నీశాను డెంతేని కోపాన
రుసరుస జూచు టారసి నంత తలిసి
ఇసిరో! యీతండు తామసు డని యెంచి,

యజ్ఞ ఫలంబున కితడు పాత్రుండుగాడు, ఈ యీశ్వరునకు శరీరపూజ లేకుండుగాక యని,

ద్విపద

కుతుకమ్ము మీర వికుంఠపురి కరిగి,
అతులితై కాంతమ్మునందు కేశవుడు
నీల నీరదకాంతి నిర్నిద్ర శాంతి
దేలుచు గడలిగాచూలి నెదదాల్చి
కనుమోడ్చి తనదెస కనగొనకున్న;
గనలుచు మౌని శ్రీకాంతువక్షమును
దనపాదతలమున దన్నగా; శౌరి
వనజాతపత్రలోచనములు విచ్చి
ఆదిత్యసమతేజు నా మౌని గాంచి
పాదాంబుజమ్ముల ప్రణతుడై వ్రాలి
"కటిక నా యెద దాకి కందినదేమొ
జటినాథ మృదుపాద సరసిజం" బనుచు
పాదముల్ కడిగి, తత్పాదతీర్థమ్ము
మోదమున తనశిరమ్మున జల్లుకొనియె
"సెలవిండు మీరు వచ్చినపనియేమొ
తలదాల్చి మీ యాన ధన్యుండ నగుదు"

అని హరిపల్కు టారసి మహాముని లజ్జితుడై "ముకుంద! విశ్వనికరతుంద! సత్త్వగుణశాలికి, ఈ భువన ప్రపంచ పాలన శుభశీలికిన్ దగు బళా! యిటువంటిది తాల్మి, నైపవే నను, విధింశకరార్చిత! సనాతన! నిత్య! నిరంజనా! హరీ!"

అని హరికల్యాణ గుణ గానంబుసల్పుచు వీడ్కొని చనినంతట,

ద్విపద

మునినాథ పదఘాతమున సొమ్మసిల్లి
వనజాలయ యొకింతవడి దెప్పిరిల్లి,—
అతిధూర్తుడగు మౌని కంజలి యొగ్గి
నతశిరస్కుండైన నాథుని గాంచి,
కనుదోయి బాష్పముల్ గ్రమ్మ నిట్టూర్చి
కినుక పెంపున కేశవున కిట్టులనియె.

లక్ష్మి

దేవతా! యీ దాసి సేవించుకోకుండానె వెళ్ళిపోయారా అయ్యవారు? నాది కదా యీ అపచారమంతా. మీ వక్షమందుండే నా కరకుశరీరం కదా పూవువంటి వారి పాదానికి సోకింది. పోయి తోడుక రండి. వారి పాదసంవాహనం చేసి ధన్య నౌతాను.

సూత్రధారుడు

ఓ హోహో! ఏమి గడుసుదనం! అమ్మవారికి ఎంత అభిమానం!

కథకుడు

అనుచు, ఈసుమై బల్కుచు, అంత కంతకు వెక్కసంబైన అవమానక్రోధము నాపలేక, మానహీనుండని మాధవుని పొత్తు మనంబున రోసి రమాదేవి ఏమనుచున్నది...

ముఖారి రాగం — జంపె తాళము

చెల్లెబో దేవ! మీసేవ ఈనాటితో
చెల్లరే! దాసి కిక సెలవిండు దయజూచి ॥చెల్లెబో॥
ఒల్ల నీ యవమానభల్ల మెద గాడగా
కొల్లబో యెను సిగ్గు వల్లమాలిన యొగ్గు ॥చెల్లెబో॥
కేశవునిసతి కంబుధీశు కూరిమిసుతకు
వాసియౌనే తుదకు వైసిమాలిన బ్రతుకు ॥చెల్లెబో॥

సూత్రధారుడు

అమ్మవారు గట్టిపట్టే పట్టింది. ఎలా శాంతిస్తుందో మరి?

కథకుడు

ఖరహరప్రియ రాగం - జంపె తాళము

సిరి క్రోధవివశయై చింతాభరాత్మయై
పెరిమ విడనాడి ఎడవీడ బలుకంగా
హరియు కన్నులందమ్ముమందు మందస్మితము
నెరయగా, నిటుపల్కె నెనరుటిపడగా.

కేశవుడు

శరళాక్షి! యీ ముని విధాత్రు పుత్రుడు గాదె
వరపౌత్రుడగు మనకు పరతత్త్వ విదుడు
పాపని దోసంగులను సైపరే తలిదండ్రులు
లా పగిది నీ మౌని సైపదగు మనకు.

కథకుడు

హరి యిట్లు పల్కుటయు,—
సిరియును కాలి బొటనవ్రేల్
ధరణిన్ రాయుచును, బాష్పధార లురలగా

లక్ష్మి

హరి నారాయణ కేశవ
పరమాత్మ ముకుంద మాధవా గోవిందా!
దేవరవారి యోరిమి కిదే నతిసేతును, మౌని త్రుళ్లరి
డై వెసదన్నె నాకు నెలవైన యురం బది చిత్తగించి. మీ
భావము సమ్మతించినను, బాపురె! యీ పెరవాని కాలితా
కేవముగాదె మానవతి? కీ మొగమిచ్చక మేల శ్రీవారీ!

ద్విపద

మీ సేవ యిన్నాళ్లు చేసినందులకు
దాసురాలికి ఆతతాయి భూసురుని
కాలితాకు లభించె, జాలు పదివేలు
ఏల నాకీక దాల్మి? ఏల మీ బల్మి?
సిరి భాగ్యవతి యంచు సరివారు మెచ్చ
పరువుగా నిన్నాళ్ళు బ్రతికినదాన
నలుగురిలో ఎట్లు తల ఎత్తుకొందు?
సెలవిండు నాథ! యీ చింతాభరమ్ము
అవమానభారము నారిపోవగను
దవుదౌల నెందైన తల దాచికొందు.
తొలిజాముల నే పాపము
సలిపితినో, ఆ యఘమ్ము చల్లారగ నా
తలపున మీ పదయుగ్మము
నిలిపి తపము సలిపికొందు నీరజనయనా!

కథకుడు

అపుడు శ్రీహరి యేమని పల్కుచున్నాడు—

కాంభోజి రాగము-త్రిపుట తాళము

దేవి వల దీ యలుక నీ పదసేవకుల దెస దొసగు గల్గిన
కావ దగదె దయావిధేయవు కావె సుదతీ ॥ దేవి ॥
నీవులేని వికుంఠపుర మిది, నీవు విడియని ఎడద నాయది
దీవెలేని గృహమ్ము భాతిని తేజ మెడలున్ ॥ దేవి ॥
శ్రీనివాసుడనైతి నీ దయ, పూని ప్రోచితి ముజ్జగమ్ములు
పేని కెపు డనపాయినివి నీవేను గదవే! ॥ దేవి ॥
కడలిరాయని కేమి చెప్పుదు? కంజజునకెటు మోము జూపుదు?
పడతి నన్నెడబాసి చనె నని నుడువ గలనా? ॥ దేవి ॥

కథకుడు

ప్రార్థించినను శ్రీదేవి మానక్రోధమ్ము విడువ నేరక
ది—

అఠాణ రాగము — జంపె తాళము

నాథ! యీ యిందిరకు మీ యడుగు
డెందము వియ్య మందు నిది నిక్కువము ॥ ఎందున్న ॥
ముంచి సెలవిమ్ము దాసి మ్రొక్కులు గొమ్ము
గునుగాక! నిర్భయము నీ కగుగాక! ॥ ఎందున్న ॥

కథకుడు

ంది, భూనీళాదేవులం జేరబిలచి,

లక్ష్మి

ుళార! మీవలన నేగి యొకప్పుడు నేనెరుంగ, నా
సంగుగల్గిన కృపన్ సయిరింపరె, నన్ను నంపరే!
ు దానయై తిరుగు నెల్లపుడుం బలు రూపు లూని శ్రీ
డింత యేమరక వర్తిలుడమ్మ! శుభమ్ము మీ కగుఁ.

కథకుడు

ారల కప్పగించి, నిశ్చేష్టుడై తలవాల్చియున్న విభుని
న్నీటితో మరలి కనుంగొనుచు శ్రీదేవి భూలోకమ్మునకు
అందు కొల్లాపురమ్మున సకలాభీష్ట దాయినియై బహు
మ్ము వసింపుచున్నంత—

సూత్రధారుడు

య్యో! ఎంతపని జరిగిందంటేనూ! లక్ష్మీనారాయణులకే
రేదే ఎడబాటు! ఆ నారదుడు అడుగుపెట్టగానే అను
ను—ఏదో మునుగుతుందని.

కథకుడు

ఇందులో వారదడి దేమున్నదండీ! అంతా ఆ నారాయణ మూర్తి లీల తప్పితే, ఆ స్వామిదివ్యచిత్తాన ఎలా ఉందో అలా జరక్క తీరదు. తక్కినవారంతా నిమిత్తమాత్రులు

సూత్రధారుడు

ఈ యాలీమొగుళ్ళ కీచులాట బాగానే ఉంది; కాని లక్ష్మి అమ్మవారు వెళ్ళిన పిమ్మట స్వామి ఏమి చేసారో?

కథకుడు

అంతట గోవిందుడు రమాదేవి లేని వైకుంఠంబున నిలువనోల్లక, కానున్న కార్యం బూహించినవాడై, భూనీళలం బిలిచి, లక్ష్మిని వెదకి క్రమ్మర తెత్తు ననియు, అందాక మీరు పార్షదులతో వైకుంఠము గనిపెట్టి యుండుడనియు జెప్పి వారల వీడ్కొని చనువాడై,

ముఖారి రాగము—జంపె తాళము

ఎదమీది యింపిర ఎడబాయుగాకేమి
హృదయపద్మమునందు ఇందిరాదేవి
పదిలమైలేదె? నిత్యానపాయిని కాదె?
ఇది జగన్మంగళాస్పద మౌను గాకేమి? ॥ ఎదమీది ॥

అని చింతించి,

సావేరిరాగము - జంపె తాళము

ఏకతమ్మున వెడలె శ్రీకాంతు డా వేళ
వైకుంఠమును వీడి వనమాలి దెసమాలి ॥ ఏకతమ్మున ॥
పులుగుతత్తడి లేక, చిలువవానుపు లేక
చెలు వెసగు వక్షమున కలిమిచెలి లేక ॥ ఏకతమ్మున ॥

తొలుపల్కుల బరాబరుల సందడులు లేక
నలుకెలంకుల పార్షదుల హాహాహాకి లేక ॥ ఏకతమ్మున ॥
వనజజాండము కుక్షి ధరియించు తొలివేల్పు
అణువులో నణువగుచు అఖిలమ్ము తానగును ॥ ఏకతమ్మున ॥

ఇట్లు భూలోకమ్మునకుం జని, రమాదేవి వెండియు తన చెంతకు వచ్చు నుపాయమ్ము చింతించుచు, శేషాచలమ్మున కేగి, అది ఏకాంతప్రదేశమ్మని నిశ్చయించి, అందు వారాహ పుష్కరిణికి దక్షిణదిశయందున్న తింత్రిణీ వృక్షమ్ము చెంగటనున్న పుట్టలో సూక్ష్మరూపమ్మునం బ్రవేశించి, అజ్ఞాతమ్ముగా బహుకాలమ్ము గడపె నంతట,

సూత్రధారుడు

చూడు బాబూ! భర్త తనకోసం ఇలా బెంగపెట్టుకు, అజ్ఞాతంగా పడివుంటే ఆ యిల్లాలు లక్ష్మి అమ్మవారు చూస్తూ ఊరకుందా?

కథకుడు

ఎందుకు ఊరకుంటుంది! ఏదో కోపంకొద్దీ బయలుదేరి వచ్చిందే కాని అమ్మవారికి మాత్రం మనసు పీకుతూ ఉండదూ?

సూత్రధారుడు

బాగా చెప్పేవు నాయనా! నా ఆయువుకూడా పోసుకు వెయ్యేళ్లు వర్ధిల్లు. ఆవిడకు మనస్సు పీకుతూ వున్నా, ఆడవాళ్లకుండే అభిమానం బయటపడనివ్వదులే; ఏమంటావ్? ఊఁ, తరువాత కథ కానీ, విందాం,

కథకుడు

అంతట కొల్లాపురీ మహాలక్ష్మి అమ్మవారు శ్రీమన్నారాయణుని ప్రచ్ఛన్నవృత్తి నెరింగి తానొక గొల్లపడుచు వేషమూని బయలు దేరెనట, ఎటువలెనూ——

బిలహరి రాగము—జంపె తాళము

గొల్ల పడుచై తాను కొల్లాపురీ లక్ష్మి
చల్ల గొనరో యమ్మ చల్లో యనుచు వచ్చె ॥గొల్ల॥

దయజిమ్ము కనుదమ్మి కాటుక ముసుంగుతో
మయిజారు కుడియోర పైటచెరంగుతో ॥గొల్ల॥

అలతికప్పున గప్పి తెలి పల్వరుస డాలు
తల దుత్త పైబెట్టి తరపిదూడల పాలు ॥గొల్ల॥

పాపరా సెజ్జపై పాల్కడలి పవళించు
పాపనికి ప్రియమైన పాలు పాపహారాలు
పాలు గొనరో యమ్మ! పాలో యనుచు వచ్చె
వెన్న గొనరో యమ్మ! వెన్నో యనుచు వచ్చె ॥గొల్ల॥

కథకుడు, ద్విపద

చోళభూపాలకుం డేలేటి పురమునకు
శ్రీలలన యిటు గొల్ల చేడయై చనుదేర
కపిలగోవై వచ్చె కమలాసనుడు తాను
త్రిపురాంతకుడు వెల్లకే పగుచు తోడరా.

సూత్రధారుడు

ఏమిటీ! బ్రహ్మదేవుడూ శివుడూకూడా చక్కావచ్చారూ?
అవునులే, దేవత లందరిదీ ఒకటే పార్టీ.

కథకుడు

ఇట్లు అజహరులు గోవత్సములై చనుదెంచిన సన్న యెరిగి
రమాదేవి కన్ను క్రేవల ప్రియమ్ము దొలక వారల గార
వించి, ఆ యావును. దూడను అమ్మ జూపెనట, ఎటువలెను—

పూరీకల్యాణి రాగము—జంపె తాళము

చోళపుర జనులార ! సుకృతాత్ములార !
ఆలపాల్ద్రావు నిత్యానందులార ! ॥చోళ॥
నాల్గుచన్నుల ప్రణవనాదాలు జుమ్మనగ
పొల్గురియు నీ యావు బహుపుణ్యములప్రోవు ॥చోళ॥
నొసట మచ్చున్న ఈ పస్రికేపు గుడుచువై
నిసువు లా పాల్ద్రావ విసమే యరిగిపోవు ॥చోళ॥
కొలువుండు నమ్మ ఈ గోవు ముఖమున వాణి
విలసిల్లు నీ కోడె కలగలిసి శర్వాణి ॥చోళ॥
ఈ వత్సతరి రొక్క మిచ్చి కొనరారయ్య
శ్రీవత్సలాంఛనుని సేవించుకొనరయ్య ॥చోళ॥

కథకుడు

అంతట చోళరాజు దేవేరి తన బిడ్డ పాలకోసమై ముచ్చటపడి, అడిగిన రొక్కమిచ్చి ఆ యావును దూడను కొనినంత, రమాదేవియు సంతసించి. ఇంక శేషాచలవాసున కీ యావు పాలొసంగి, ఆకలి దీర్చుం గదా యని యథేచ్ఛం జనియె.

సూత్రధారుడు

ఎంత పుణ్యాత్మురాలయ్యా ఆ రాణి! చతుర్ముఖుణ్ణి, త్రిలోచనుణ్ణి తన కొట్టంలో కట్టివేసుకొన్నది కదయ్యా!

కథకుడు

అవును. అదృష్టమంటే అలా కలిసి వచ్చిందే మరి!

సూత్రధారుడు

బాగా చెప్పేవు. చూడు బాబూ! నీ పేరేమిటో చెప్పేవు కావు.

కథకుడు

ఏడుకొండలవాని పేరే నండి, వేంకటరమణమూర్తి,

సూత్రధారుడు

వాయనా! వేంకటరమణమూర్తీ! ఆ రాణి తన బిడ్డకోసమని
 ఆవు నంత ముచ్చటపడి కొనుక్కుంది కదా! మరి ఆ పుట్టలో
 నారాయణమూర్తి పొట్ట ఎలా నిండుతుందంటావు?

కథకుడు

ఇదిగో! మనవిచేస్తున్నా కాదూ, ఇట్లా కపిలగోవు చోళరాజు
 ఆలమందతో మేతకేగుచు ప్రతిదినమును వేంకటాద్రిపై కెక్కి,
 స్వామి వసించెడి పుట్టబిలమ్ములో నాల్గుచన్నులు ఏకధారగా
 జేసి, పాల్గురిసి, గోవిందునకు తుష్టి గూర్చుచున్నంత—

సూత్రధారుడు

ఒలేవాడవు మూర్తీ నువ్వు! పాలన్నీ ఆ పుట్టలోనే పోస్తే
 రాచబిడ్డపొట్ట ఏం కావాలి?

కథకుడు

పెద్దలు మీరూ అంతే అన్నారూ?

జీవకోటులనెల్ల పోషించి పెంచు
ఆదినారాయణుడు తన యావుపాల
నిట్లు పరితుష్టు డగుచుంట ఎరుగలేక
చోళవిభురాణి యపుడు గోపాలు బిలిచి.

గోపాలునితో నేమనుచున్నది—

ఆవు జూచిన కడుపు నిండు నయారె దీని పొదుంగులో లేవు
 పాలొక చుక్కయేని ఐతే! యిదేమిర గొల్లడా?

గొల్లవాడు

దేవరాన, ఇదేమి వింతయో తెలియదో దొరసాని! ఈ
 యావు పోకడలెల్ల నిక్కము నరసి యెల్లి వచింతెదన్.

కథకుడు

అని పలికి గొల్లండు మరునాడా యావు చర్యలు గనిపట్టియున్నంత -

ఎప్పటట్ల గోవు పుట్టనెక్కి నాల్గుచన్నులన్
కుప్పగూర క్షీరధార కురియుచుంట జూచి, నూ
యప్ప! తెల్లమాయె దీని యాగడమ్ము, నా పయిం
డప్పు వెట్టి ముచ్చుకాన! తప్పిపోవనేర్తువే?
ఔనె గోవుకాన! ముచ్చువై యిదా? వృథాగ పాల్
కానపాలు చేసి నాకు గండకత్తెవైతి; నిన్
జానకుఁ బలియకున్న కాను గొల్లబోయడన్
కాను సుమ్మటంచు చేతి గండ్రగొడ్డ లెయ్యెడన్,
బిరాననెత్తి గోవునెత్తి బిట్టు వ్రీలగొట్టబో
కరీంద్ర రక్షకుండు గోవు గావ పుట్టనుండి "మా
నరా, దురాత్మ" యంచు వ్రేటు నాటకుండ అడ్డురాన్
హారి హారి! తదుత్తమాంగ మగ్గమయ్యె వ్రేటుకున్
పరశుధార హరిశిరస్సు బక్కుమనుచు వ్రీల, నం
బరము నంట రుధిరధార పర్వులెత్తె బుస్సునన్
చరమదిశను నెత్రుచేర్ల సవితృడంత మునిగిపోన్
ధరను ద్రెళ్ళిపడియె గొల్ల దానవారి ముందటన్.

సూత్రధారుడు

అయితే, రమణమూర్తి! ఈ మేళతాళాలసందడిలో నాకు తెలిసింది కాదు. ఏమయిందంటావు? నారాయణమూర్తి శిరస్సే నా పగిలింది?

కథకుడు

అవునండి. శిరస్సు పగిలి పడుతాళ్లెత్తున రక్తం చిమ్మింది. గొల్లవాడు అడలిపోయి ప్రాణాలు వదిలాడు.

సూత్రధారుడు

హరి హరీ! ఎంతపని జరిగిందంటేనూ! మరి ఆ గోవుమాట?

కథకుడు

ఆ గోవు అంబే యని అడలుతూ, మట్ట ఎగబట్టి, ఒక్క పరుగున చోళరాజు సన్నిధిలో పోయి పడింది.

సూత్రధారుడు

పాపం! దాని బాధంతా నారాయణమూర్తికోసమే కానితనకోసం కాదు సుమా.

కథకుడు

బాగా సెలవిచ్చారు. అది బ్రహ్మదేవుడే కాదటండీ. అంతట చోళరాజు 'గోవు ఒంటరిగా ఇలా అడలుకొంటూ వచ్చిందెందువల్లా? గోపాలు డేమైనాడా?' అని ఆలోచిస్తూఉంటే ఆ గోవు కన్నీరు కారుస్తూ మళ్ళా వేంకటాచలం ముఖం పట్టినంత చోళరాజు కేమీ పాలుపోక సపరివారంగా ఆవు వెంట తానూ బయలుదేరినవాడై —

సూత్రధారుడు

సరాసరి పుట్టదగ్గరకే వచ్చింది కాబోలు, గోవు?

కథకుడు

రాజు ఆ పుట్టను, అక్కడ మడుగులుగట్టిన రక్తాన్ని, చెంతనే చచ్చిపడిఉన్న గొల్లణ్ణి చూచి, ఏమిటీ వింత అని విచారిస్తూ ఉండగా, శ్రీమన్నారాయణమూర్తి —

తోహరా

చతుర్బాహువుల శంఖచక్ర ముఖసాధనములు ధరియించి క్షితిపతి ముందట రక్తసిక్తుడయి కేశవదేవుడు నిలిచి.

ఏమనుచున్నారు —

అఠాణ రాగము—జంపె తాళము

ఔనోయి! చోళనృప! అమితగర్వాటోప!
మౌనులై యిటనున్న మామీదన ప్రతాప? ॥ఔనోయి॥
గతిలేక ఒరుల సంగతి బోక ఇటు లేక
గతి పుట్టలోనున్న వెతకి చంపుదువన్న? ॥ఔనోయి॥
గోవధము వారింపబోప నాతల వైవ
గా వచ్చునోటు! పెను గండ్రగొడ్డలి వ్రేటు? ॥ఔనోయి॥
నరుడవా నీవు దానవు డవుదు వేగాని
తిరుగు మింక పిశాచదేహమును బూని ॥ఔనోయి॥

ఇట్లు శపించినంతట చోళరాజే మనుచున్నాడు—

నిరపరాధిని దేవ నాయెడ నేరమించుక లేదు, నీ
విరవుగా నిట నున్న వైనము నెరుగ కీతడు చెల్లరే!
పరశువెత్తిన దాని కింతటి పాపకర్మము కూడె, నో
హరి! మురారి! కృపాక్షరా! శరణంటి దాసుని గావవే!

కథకుడు

అనుచు చరణమ్ములపయింబడి వేడికొను భూమిపాలుని పయిం
జాలిగొని శ్రీహరి ఏమని పల్కుచున్నారు—

కేశవుడు

రాజా! వేగిరపడి నిన్ను శపించాను. దిక్కుమాలి యిటనున్న
నాకీ పాపకర్మంకూడా చుట్టుకోవలెనా? నా పలుకు తిరుగ
నేరదు. నే నేమి సేతు? నీవు నిరపరాధి వవుదువు కనుక
చిరకాలం ఇట్లు పిశాచరూపంతో ఉండి, నేను ఆకాశరాజు
కూతును చెట్టపట్టినపుడు నా శిరస్సున మకుటమై నిలువగలవు.
ప్రతి శుక్రవారం ఆ కిరీటం అరుగడియలు నేను ధరించి ఆనంద
బాష్పములు వహింతును. దానిచే నీకు సుఖమగుగాక.

సూత్రధారుడు

పరిజనం చేసే పాపంలో యజమానికూడా పాలు పంచుకోవటం ఇదే కాబోలు.

కథకుడు

పిమ్మట శ్రీనివాసుండు తలపుండు మానుటకై జిల్లేడుపాల కోసం, పత్తికోసం ఆ కొండపై తిరుగుచుండ ఒకనాడు,
వృషభదానవేంద్రు వెన్నంటి యేగిన
భూవరాహపతియు బోరిలోన
వాని నుక్కడంచి, వసుధాసమేతుడై
చేరవచ్చె వృషభశిఖరి కపుడు.

సూత్రధారుడు

వృషభాసురుణ్ణి చంపటంవల్ల వారాహగిరికే వృషభాద్రి అనేపేరు వచ్చింది, అంతేగా? ఆ స్వామి తమ నెలవుకే వచ్చారు,

కథకుడు

అంతే. ఇ ట్లేతెంచి ఎప్పటియట్ల గిరి సానుదేశమ్ముల విహరించుచుండి, అందొకచో హరిం గాంచి, ఈత డెవ్వడో క్రొత్త దనుజుం డని యెంచి, "ఒరీ! ఎవ్వండవు, నా మెట్టపై కాలు పెట్టితి" వని ఘుర్ఘురింప, హరియు వరాహదేవున కెదుటపడ నోడి, ఒక పొదలో దాగియున్నంత.

సూత్రధారుడు

అవునవును. కానికాలంలో అయినవాళ్ల ఎదుటపడటం కష్టమే.

కథకుడు

భూవరాహపతి మోరయెత్తి మునికోర జీర దరిజేర
చేవ యుడిగి హరి శిరము వాంచి అట చింతనుండ పొడగాంచి.
నిదానించి చూచి, హరిగా నెరింగి నొచ్చుకొనుచు, నెయ్యమ్మున ఏమనుచున్నారు—

భూవరాహపతి

వైకుంఠవాసా! ఈ గూఢవర్తనమేల? [illegible] దైన్య[illegible]నకు గతంబేమి?

కథకుడు

అని యడిగిన హరి నిజవృత్తాంతంబెల్ల విన్పించి ఏమనుచున్నారు—

పున్నాగవరాళి రాగము—ఖండగతి

ఇల్లు వాకిలి లేక ఇల్లాలికిం గాక
అల్లాడుచున్న నన్నాదరింపగదన్న! ॥ఇల్లు॥
తలదాచుకొందు, నీ దండనే పడియుందు
నెలవిమ్ము నాకింత, తొలగు దాకీవంత ॥ఇల్లు॥

కథకుడు

అంతట భూవరాహస్వామి ఏమనుచున్నారు—

జంఝూటి రాగము—ఖండగతి

సిరిగలాడవు నీవు పరువు గలవాడవో
హరి! నీ పొరుగు పేద కగును కాదా బరువు ॥సిరిగలా॥
పరయాచకము గాక విరజయా యీ కోలను
అరుదైన వైకుంఠపురమొ గిరికందరము ॥సిరిగలా॥
వెలయిచ్చి కైకొనవె ఇల నీ వలసినంత
వలదయా మొగమోట [illegible]లువదగు నీయంత ॥సిరిగలా॥

సూత్రధారుడు

గట్టివాడే నయ్యోయి, భూవరాహస్వామి! పద్మనాభయ్య పప్పు లుడకనిచ్చేట్లులేదు.

కథకుడు

గొప్పవాళ్ళ పొరుగు ముప్పుగాదటండీ! అంతట శ్రీహరి యేమనుచున్నాడు—

కేశవుడు

వలదు వరాహదేవ! పెరవాడనె నీ కిటులాడ? సర్వముం
గలిగియు లేనివాడనయిగా నిను వేడెద; నీయధీన మీ
యిల సకలమ్ము, నాకు నొకయింత యొసంగ కొరంతరాదయా!
బలియుడవైన నీ పొరుగు భద్రము నాకని చేయి సాచితిన్.

సామ రాగము - ఆది తాళము

ఈ యుపకారము చేయగదవయా
ఈ యగచా ల్లెపు డిటు లుండవయా ॥ఈ యుప॥

కలివచ్చినపై కలుగు సకల మీ
మలపై విడియంగలదు వికుంఠమె ॥ఈ యుప॥

అపుడు నరులను నీ కొండ కాకర్షించి, ముందుగా నీకు పంచామృత స్నానం, నిత్యనైవేద్యం కల్పిస్తాను. నీ పుష్కరిణిలోనే ముందుగా అందరు స్నానంచేస్తారు

సూత్రధారుడు

అవునవును, కలిమి కావాలంటే ఎవరికైనా కలికాలమే రావాలి.

కథకుడు

భూవరాహస్వామి ప్రసన్నుండై, హరికి నూరడుగుల మేర కొలిచి యిచ్చి, తత్పరిచర్యకై వకుళమాలిక అనే భక్తురాలిని నియమించి నంతట,

సూత్రధారుడు

అవును. హరి యేమిటి, కిరి యేమిటి, వారూవారూ ఒకటే కనక చివరకు రాజీపడ్డారు. బాగానేవుంది కాని, ఈ వకుళ మాలిక ఎవరు బాబూ?

కథకుడు

పూర్వం యశోదాదేవి కృష్ణభగవానుణ్ణి పెంచింది కాదండీ కొంత కాలం! ఆ మమకారం తీరక హరి పరిచర్యకై కనిపెట్టుకొని ఉండి, ఈ రూపంతో చక్కా వచ్చింది. ఆ నాడంటే ఆ తల్లిని నానా అగచాట్లు పెట్టాడుగాని ఇప్పు డేముంది పాపం, తప్పిపోయిన కుర్రాడిలా తిరుగుతున్నాడాయె. పైగా, తలమీద పెద్దపుండాయెను.

అనాడు వ్రేపల్లెలోన లీలాబాలు
డైన కృష్ణమ్మతో నా యశోద
వేగలేదాయె, నేడీ గుట్టలంబడి
గతిమాలి యిట్లు ప్రాకృతునివోలె
తిరిగెడి హరి చేరదీసి, నెయ్యమ్మార
తలపుండు గడిగి, మందులును మాకు
లిడి, పుట్టతేనియ వడచి శ్యామాకాన్న
మున గల్పి తిన్పించు బుజ్జగించి
అనుదిన మ్మోలలార్చు, నాయన్న శ్రీని
వాస! రావోయి యంచు నా వకుళమాల
పెరిమె మీగగ తలదువ్వి, విరులు గ్రుచ్చి
పెండ్లికొడుకట్లు గోముగా పెంచుకొనియె.

సూత్రధారుడు

ఆహాహా! ఏనాటి అనుబంధాలండీ యివి!

కథకుడు

మీ కింకోమాట చెప్పమరిచాను, ఇన్నాళ్లు హరి ఉంటూ వచ్చిన ఆ పుట్ట వున్నదే, అది కౌసల్యాదేవకీదేవుల గర్భవాసం సుమండీ! ఆ పుట్టపై నీడలారే చింతచెట్టే దశరథవసుదేవుల చల్లనిబాహుబంధం. మీరు విన్నారో, లేదో?

సూత్రధారుడు

కావచ్చు. శ్రీహరిదంతా చిత్రచరిత్ర. ఇంతకు మనకథలోకి రండి. వకుళమాలిక పోషణతో శ్రీనివాసమూర్తి వుంజుకొన్న తరువాత ఏమయింది?

కథకుడు

స్వామివారిలా కొలుకునేలోపల అచట తొండమండలంలో నారాయణవనం పాలించే ఆకాశరాజు ఇంట్లో లక్ష్మీఅమ్మవారు అవతరించారు

సూత్రధారుడు

అబ్బెబ్బెబ్బె. ఎంత గంతువేసేవంటేనూ! ఆకాశరాజేమిటి. కొల్లాపురంలోఉండే లక్ష్మీదేవి ఆయనింట్లో అవతరించట మేమిటి! కథంతా కొత్తపుంత పట్టిస్తున్నావు.

కథకుడు

తమరు పెద్దలు. ఇందులో కొత్తయేమున్నదండి? నారాయణ మూర్తి భూమిపై అవతరించినపుడల్లా లక్ష్మీఅమ్మవారు అవతరిస్తూ ఉంటుంది కాదండీ. ఆనాడు జనకమహారాజింట్లో కుండినరాజింట్లో పుట్టినట్టే ఈనాడు ఆకాశరాజింట్లో పుట్టింది.

సూత్రధారుడు

అయితే ఈ ఆకాశరాజెవరు?

కథకుడు

పూర్వం కాళహస్తిలో మాధవుడనే బ్రాహ్మణు డుండేవాడు. అత డొక మతంగకన్యను పెండ్లాడి కులభ్రష్టుడై తుదకి వెంకటాద్రిని దర్శించి పాపరహితుడైనాడు. అతడే సుధర్ముడనే రాజుకు ఆకాశరాజనే పేర జన్మించాడు.

సూత్రధారుడు

ఆకాశరాజనే పేరు బాగుందిసుమా. అమ్మవారు పూర్వం సముద్రుడికి, భూమికి పుట్టింది. ఇప్పు డాకాశానికే పుట్టింది.

కథకుడు

ఆకాశరాజు కామె దొరికిందేకాని పుట్టలేదు సుమండీ ఆ తల్లి అయోనిజ కాదటండీ!

సూత్రధారుడు

ఎట్లా, ఎట్లా! దొరికిందీ!

కథకుడు

మరే

ఆ నరపాలకుం డనపత్యు డగుచు
పూనెను కావింప పుత్రకామేష్టి
జన్నమ్ముకై భూమి దున్నుచుండగను
పున్నెమ్ముపంటయై పొడమె నొకకన్నె
ఆ కన్నియం గాంచి ఆకాశరాజు
ఆకాశమంటె హర్షాతిరేకమున
పద్మమం దుదయించి పద్మాయతాక్షి
పద్మావతి సమాఖ్య పడసి వర్ధిల్లె.

పిమ్మట ఆ రాజుకు వసుధానుడనే కొడుకు పుట్టేడు.

సూత్రధారుడు

ఒక టేమిటి. లక్ష్మీఅమ్మవారే ఇంటికి నడిచివస్తే లోపమేముంటుంది?

కథకుడు

లలితగాత్రను నేత్రజితశతపత్ర మాచెలి...

సూత్రధారుడు

ఆగు ఆగు. పద్మావతీదేవిని వర్ణిస్తున్నావా ఏమిటి కొంపతీసి! సాక్షాత్తు లక్ష్మీదేవి అన్నావు చాలదటయ్యా. కథలోకి రా!

కథకుడు

చిత్తం. శ్రీనివాసమూర్తి ఒక్క దివసమ్మున వేటకై బయలు దేరెనట. ఎటువలెను——

దాసానిపూవన్నె తళుకు పుట్టము కుచ్చె
లిరవొంద వెనుకకు ఏరిచికట్టి
గలుగల్లుర నెడి గజ్జెలతోడి నీలి చ
ల్లడ మూని. వెండిబిళ్లల హారంగు
మొలనూలులోన పచ్చల పిడిబాకు గీ
లించి. ఊదావన్నె కంచుకమ్ము
తాలిచి, తలచుట్టు నీలికోక ధరించి
నెమలియీక తు[illegible]యి సీటుగులుక

దంతపుం గుండలమ్ములు. దండకడెము
నొసట కస్తూరితిలక మింపెసగ, నిలివె
డెత్తు భల్లమ్ము చేబూని. గిత్తకనుల
శ్రీనివాసుడు బోయవేసాన వెడలె.

రామప్రియ రాగము – ఖండగతి

హరివెడలె వేటకై తురగమెక్కి సవారి
శరచాపములు దాల్చి గిరులచరియలదారి ॥హరి॥
గిరిసానువుల తురగ ఖుర హతుల తకతకల
మురజములు మ్రోగ ధాతురజమ్ము రేగగా ॥హరి॥
తూపుతూపునను ఘాతుకమృగమ్ములు కూల
చాపటాంకృతి బెదరి చదల పులుగులు తేల ॥హరి॥

ఇటొక అడవియేనుగు వెంటదగిలి యేగి, నారాయణవన పురోప కంఠమ్మున, పద్మావతీదేవి తన చెలికత్తెలతో విహరించు ఉప వనమ్ము చెంత ఆ మదపుటేనుగు శ్రీనివాసాభి ముఖమ్ముగా మరలి, తొండమెత్తి నమస్కరించి అంతర్ధానము చెందుటయు,

సూత్రధారుడు

అవును. స్వామివారిని అమ్మవారిచెంత చేర్చింది. మాయమయింది. బాగుందయ్యా బాగుంది తరువాత ?

కథకుడు

పద్మావతీదేవి చెలికత్తెలు అట్లు మటుమాయమైన ఏనుగును దానికై దిక్కులు చూచుచున్న వేటకానిం గాంచి, ఏమను చున్నారు—

మోహన రాగము - ఖండగతి

అక్కరో కంటివా అపురూప మిదియు
ఎక్కడివాడో ఈ చక్కనివాడు ॥అక్కరో॥
నీలమేఘముడాలు నేలెడి మేను
కాలుగన్నులును సింగమువంటి కౌను ॥అక్కరో॥
అనరాదుగాని మాయాకిటిం దగిలి
వెనువెంట వచ్చిన విన్వచ్చుడేమొ. ॥అక్కరో॥

కథకుడు

అంతట పద్మావతీదేవి వెడంద కనుదోయి విచ్చి చూచుచు ఏమను చున్నది—

అఠాణ రాగము - ఖండగతి

బోయవేషకాడు. పెనుమాయదారి వీడు ఈ
చాయ కేలవచ్చె వింతాయె నాలిమ్రుచ్చు ॥బోయ॥

కన్నెలాడుచోట. మనమున్న విరుల తోట తా
వన్నె వేసమూని సనసన్న రాబనేమి? ॥బోయ॥

కథకుడు

అనుటయు నా చెలులు శ్రీనివాసునితో నేమనుచున్నారు—

హుసేని - మిశ్రగతి

వింతమానిసి వగుదువోయీ యెంతకైనా తగుదువోయీ
అంతిపురి చెలులున్నతోటల పొంతనా వేటా? ॥వింత॥

శ్రీనివాసుడు

వలదు బోమముడి వాడి చూపులు తెలియ కేతెంచితి లతాంగీ
తెలుపు డిది నందనమొ అచ్చర తెరవలో మీరు ॥వలదు॥

చెలి

పురము నారాయణవనమ్మిది భూపు డాకాశావనీశుడు—

శ్రీనివాసుడు

సరిస రే, ఈ సరసి జేక్షణ వరవరుని తనయ ॥సరిస రే॥

చెలి

మేలుబళి! నేర్చితివి మాటలు మేలమేలా నీకు మాతో
చాలు వచ్చినత్రోవ బొమ్మిక జాణతన మేలా? ॥వింత॥

సూత్రధారుడు

చెలికత్తెలు గట్టివాళ్లేనయ్యోయి! మాట చొరవిచ్చేట్టు లేరు.

కథకుడు

శ్రీనివాసమూర్తేనా తక్కువవాడు? అంతవరకు తాను చేయాని
నిలిచిన చెట్టుకొమ్మను కొంచెం ఊగించి, పద్మావతీదేవి
మీద పూలజల్లు కురిపిస్తూ, అంటున్నాడుకదా—

సౌరాష్ట్ర రాగము - మిశ్రగతి

జలజపత్ర విశాలలోచన! చాలబడలితి వేటకతమున
పలుకు చెలియలొలికి నా దగ తొలగ త్రోయగదే ॥ జలజ ॥

సూత్రధారుడు

ఆఁ ఆఁ! తలిచంద్రుడు చాటు పిల్లను ఎంత మాటన్నాడూ.

కథకుడు

అపుడు చెలికత్తె లన్నారు కదా——

ఎంతసాహస, మెవ్వడవు నీ, వేది నీకుల, మేది గోత్రము
ఇంతకును ఊరేది, పేరేది, ఇంత యాగడమా? ॥ ఎంత ॥

శ్రీనివాసుడు

కలువరాయని కొలము దేవకిగన్నవాడ వసిష్ఠగోత్రుడ
తెలియవో వసుదేవతనయుని హాలధరానుజుని ॥ జలజ ॥

చెలి

ఎట్టెటూ! కలరొకో చుట్టపక్కాల్ నీకు ?

శ్రీనివాసుడు

బావ లగుదురు నాకు పాండుసుతులు.

చెలి

ఔనా! బలారె! నీ మేనెల్ల నలుపేమి ?

శ్రీనివాసుడు

జననమ్ము కృష్ణపక్షాన నాకు.

చెలి

ఆయెబో, ఏటికీ బోయవేసము ?

శ్రీనివాసుడు

రాచబాలిక వలవేసి పట్టెంచి.

**చెలి**

ఎంతకులేవు ! నీవేలు రాజ్య మదేడ ?

శ్రీనివాసుడు

చెల్లు నా యేల్బడి ఎల్లదెసల.

సూత్రధారుడు

భేషు భేష. మాటకు మాట బాగానె అందించాడుగాని పద్మావతీదేవి ఇంతకు ఏమన్నదో.

కథకుడు

పద్మావతీదేవి చెలులతో ఏమనుచున్నది.

పద్మావతీదేవి

ఏలనే మీకు వీనితో మేలమాట ?
కంచివరదుండు లేడో, రంగపతి లేడో
వేంకటాద్రీశ్వరుడు లేడో, వెట్టిగాళ
ఎరిగెరిగి తండ్రి నను బోయ కిచ్చునటవె ?

సూత్రధారుడు

ఊంహూ. అంతవరకు దిగిందికథ ?

కథకుడు

పద్మావతి ఇట్లు పల్కి, పెడమొగమ్మగుటయు, చెలికత్తెలు ఏమని మేలమాడుచున్నారు.

ఆనందభైరవి రాగము – మిశ్రగతి

ఇంత మేటియు, నింత పోటరి, ఇంత నల్లనిమేని సొబగుం
డెంత వెదకిన దొరకడే అల కంతు డితడు జయంతుడే

॥ ఇంతమేటియు ॥

శ్రీనివాసుడు

కాంతలారా, తొల్లి కోల్పడి క్రమ్మరం గనుగొంటి, నీ
యింతికై తపముంటి నేడు ఫలించె మిన్నుల నంటితిన్ .

॥ కాంతలారా ॥

కథకుడు

అనుచు వెనుదీయక, మేరమీరి డగ్గఱవచ్చుట యారసి, బాలికామణు
లాతని నొక్కపెట్టున కిలకిలనవ్వుచు రాల రువ్వుటయు, అశ్వ
రాజమ్ము మడిసినంతట, శ్రీనివాసుండును క్షతగాత్రుండై,
తూలిపడుచు చేతిభల్లమ్ము నూదికొనుచు అల్లనల్లన పర్వతాగ్రమ్ము
చేరి, దుస్తరవ్యథాకలితుండై అన్నపానమ్ము లుడిగియున్నంత,

సూత్రధారుడు

అవును, కుడిచి కూర్చోక, తన కెందుకు చెప్పు రాచబిడ్డతో సరసాలు ?

కథకుడు

అపుడు వకుళమాలిక చేరనరిగి,

కమాస్ రాగము – జంపెతాళము

ఏలరాయన్న నీకిట్టి పాటు ఘటిల్లె
కూళలెవ్వరు నిన్ను రాల రువ్విరిరా ? ॥ ఏలరా ॥

పువువంటి నీమేను పుండ్లుగా గారింప
నెవరికి చేయాడె నేమి సేతునురా ॥ ॥ ఏలరా ॥

గతిమాలి ఇటుల నొక్కరి జోలికిం బోక
బ్రతుకగా దైవ మోర్వకపోయెగా కొడుక ॥ ॥ ఏలరా ॥

విందుగా నా కనులముందు తిరిగే కూన
ఎందు కేగితి వేట కీ పాటుకొరకేన ? ॥ ఏలరా ॥

కథకుడు

అని శ్రీనివాసుని యొడలెల్ల నిమిరి, సేదదేర్చి నివ్వెరయన్నము పాలలో మెదిపి తినిపింపబోవ, అతండు తినక శూన్యవిలోకనంబుల దిలకించుచు నిట్టూర్పుచుండ, ఆ యమ్మ వెక్కుభంగుల నూరార్చుచు నేమనుచున్నది—

వకుళమాలిక

నాయన్నవుగా! నీ మనసు విప్పిచెప్పరాదోయి కన్నయ్యా! ఇంత నివ్వెరపాటు నీ కేలనయ్యా? కానలో బీతుగొంటివో, భూతం సోకిందో! కూడునీళ్లమాని, ఈ నిర్భాగ్యురాలిని హింసింపకోయీ! నీ మనసులో ఏమైన తలచితివో, ఎవరినైన వలచితివో, ఏమరుపాటు మాని, ఇదిగో నా చెవిలో చెప్పరన్నా, నా కన్నవుగా.

కథకుడు

అనుచు బుజ్జగింప ఎట్టకేల కాతండు నడచిన వృత్తాంతమెల్ల వినిపించి, ఏమనుచున్నాడు—

ఆ పద్మావతిని చెట్టపట్టనిచో నేను బ్రతుక నవ్వా. దాని నెట్లు కూరుస్తావో నీదే భారం.

సైంధవి రాగము – చాపు తాళము

ఏమని చెప్పుదునే
ఆ భామ చక్కదన మేమని చెప్పుదునే

వామలోచన సుధామయవీక్షలు
కామకోటి జనకము లతిలోకము లేమనిచెప్పుదునే ॥ ఏమని ॥

సుదతి లేనగవు సొలపున విరజా
నది వెలిదమ్ములు కదలు పదిపదులు ॥ ఏమని ॥

వకుళమాలిక

అయ్యో, కన్నయ్యా! ఎంత కోరిక కోరితివోయీ! రాచకూతురుపై
ఆశ నీ కేల పుట్టిందిరా తండ్రీ! ఇల్లా, వాకిలా? నిరుపేదలం.
మన మేడ, ఆ తల్లి ఏడ! ఆ తల్లి నెట్లు తెత్తును? ఏమి సేతును?

శ్రీనివాసుడు

అవ్వా, ఎందు కధైర్యపడతావు. నీకో రహస్యం చెప్పేను వినుకో.
ఆ తరలాక్షి కంటబడి నప్పుడె అంబుధి దాటినట్లు, దు
ర్జాతుల దైత్యులం దునిమి సాధ్విని నేగయి కొన్నయట్లు, క
న్యాతిలకమ్ము నగ్నిశిఖలందు పరీక్ష యొనర్చినట్లు, నా
కైతపియించి కన్నెయిటు లాయితమైనటు లాయె నెమ్మదిన్

సూత్రధారుడు

ఏమయ్యోయి! మీ శ్రీనివాసమూర్తికి బొత్తిగా మతిపోయి
నట్లుందే? సముద్రం దాటడమేమిటి? కన్యను అగ్నిపరీక్షచేయడ
మేమిటి? ఆ కన్య తనకోసం పుట్టడమేమిటి?

కథకుడు

అవునవును. మీ రాక్షేపిస్తా రనుకుంటూనే వున్నా నేను. ఆ తల్లి
లక్ష్మీఅమ్మవారే అనుకున్నా గాని ఈ దేవరహస్యం నాకుమాత్రం
ఏం తెలుసు? ఆ నాడు రావణాసురుడు సీతమ్మవారి నెత్తుక
పోవడానికి వచ్చినపుడు. అగ్నిదేవుడు సీతమ్మవారిని తనలో
దాచుకొని, వేదవతి అనే కన్యను రావణుని కప్పగించాడు.
రావణుడు సీతమ్మనే ఎత్తుక పోయా ననుకున్నాడు. శ్రీ
రాములవారు రావణసంహారంచేసి, విడిపించిం దా వేదవతినే. ఆ
కన్యనే అగ్నిపరీక్షచేయబోతే అపుడు సీతాదేవి వచ్చి యథార్థం
మనవిచేసి, వేదవతిని భార్యగా గ్రహించవలసిందని వేడుకొంది.
శ్రీరామచంద్రులవా రన్నారుకదా, నేను ఏకపత్నీవ్రతుణ్ణి.

ఈ జన్మలో ఆమెను గ్రహించలేను, నేను వేంకటాద్రిపై వెలసి యీమెను పెట్టిపుట్టిస్తా నన్నారు ఆవిడే యీ పద్మావతి. ఇదండీ కథ.

సూత్రధారుడు

ఏమో అనుకొన్నాను. నువ్వు గట్టివాడవేసుమా. ఎక్కడి కక్కడి కేదో ముడిపెట్టుతూనే ఉన్నావు. సరే కానీ.

కథకుడు

శ్రీనివాసు డీ రహస్య మెఱింగించినంత వకుళమాలిక వైష్ణవదాసి వేషమూని నారాయణవనమ్మున కరిగె. నంత శ్రీనివాసుండు శిరసున గద్దెబుట్టతో, కరమున టింగుబుర్రతో, చంకను బుడుతని దాల్చి, ఎరుకతయై బయలుదేరెనట—

సూత్రధారుడు

మహానుభావు డాయన ఒకటికాదు, పదివేషాలు వేస్తాడు.

కథకుడు

అచట నారాయణవనమ్మున పద్మావతీకన్య ఆరామమ్మున శ్రీనివాసుని కాంచివచ్చినది మొదలుగా, విరాళిగొని, కన్యాంతఃపురమ్మున పూలసెజ్జ బొరలుచు తనలో దా నేమని విలపించుచున్నది.

పూవులతోట కేమిటికి బోయితి; బోయినదాన నచ్చటం
దీవ యుయేల లెక్కి సుదతీమణులంగవగూడి యూగితిన్,
పూవుఁదూపువేల్పువలె బోయ యతండట కేలరావలెన్,
తీవరకత్తెనై అతని తేజిని రాల్గొని పల రువ్వితిన్ ?

కేదారగౌళరాగము - మిశ్రగతి

ఆ యలరు విలుకాడో అతనిచెలికాడో
బోయవలె వచ్చి కొనిపోయెనే నా మనసు ॥ ఆ యలరు ॥

గా, నునులజ్జపాయగా. వెడ కినుక
ప్రావులరువ్వ వాని రువ్వితి రాల ॥ ఆ యలరు ॥
నగాబోయి పట్టుపడినట్లాయె
యో ఈ గుట్టు అన్యులెరిగిన రట్టు ॥ ఆ యలరు ॥
రాచకొలమ్ము. ఆమీద కన్యాత్వ
క్కెములకు పాలౌనేమొ నా బ్రతుకు? ॥ ఆ యలరు ॥

కథకుడు

న్నీరు మున్నీరుగా. అన్నపానము లుడిగి, కన్నవారి
ం గననొల్లక. నెచ్చెలులకు మారుపలుకక, తనలో
లుకుచున్న కన్నియం గాంచి, నమ్మిన నెచ్చెలులు తమలో
వ్వరించుకొని దరియజేరి ఏమనుచున్నారు—

చెలికత్తెలు

మ్రచెల్లా ! ఇవి భూతచేష్టలేనే.
కే, ఈ సోకు పూలతోటలోదేనే.
రే, ఇది మగభూతంవలె ఉంది.
శాంతి కంతుపూజలేనే.

కథకుడు

రాడు నెచ్చెలులు పద్మావతీకన్య కసరికొట్టుచు కీల్గంటున
వ పూలచెండ్ల విసరికొట్టుచుండ చెలులు—

జంఝూటిరాగము – త్రిశ్రగతి

మాటయున్న ఇంత ఉలు కిదేలనే
వయసు వలపు దాచుకొన్న దాగునే ॥ ఉన్న ॥
ంటి కులము, జున్నుబాల ప్రాయమూ
నసు నమ్మికొంటి వే ముపాయమూ ॥ ఉన్న ॥

ఇంతవలపు ఇంత సిగ్గు నెందు జూడమూ
నుంత అతనిపే రీ చెవిచెంత నూదుమూ ॥ ఉన్న ॥

కథకుడు

అనుచు పలుగతుల మేలమాడుచుండ నంతకంత కగ్గలంబైన విరాళిం దాళజాలక పద్మావతి అలుకమాని వలవంతపాలై నిలుపోపలేక—

వద్మావతీదేవి

నాటకురంజిరాగము - మిశ్రచాపు

తాళనే, మేలము లేలనే
ఓ చెలులార చాలనే తాళజాలనే

తాళనే ఈ మందెమేలము చాలునే, పువుదోట కాతం
డేల వచ్చెనె, నా మనోధన మేల ముచ్చిలిపోయె నయయో
॥ తాళనే ॥

ఏమి తలచిన వాని తలపే ఏమి చూచిన వానిరూపే
రామలారా! ఇంద రుండియు కామితము నీడేర్ప రిది నా
నోము ఫలమొ మరేమి పాపమొ ॥ తాళనే ॥

సూత్రధారుడు

పావం! పట్టి కసుగాయ. ఈ కన్నె వలపు ఎట్లా కడతేరుతుందయ్యా మూర్తి?

కథకుడు

మీరుకూడా బెంగపెట్టుకోకండి మరి, స్వామి బయలు దేరారు కారూ, ఎరుకత వేషంతో, అరుగో.

ఎరుకత - ఎరుకల కాంభోజిరాగము

ఎరుకడగరోయమ్మ ఎరుకా
గరితలారా మంచియెరుకా ॥ ఎరుకడగ ॥

తలపు తలుపులు తెరచి
తెలియజెప్పే ఎరుక ॥ ఎరుకడగ ॥

తెరల మరుగున దాగు ఎరుక
మరపు మడతల దోగు ఎరుక
ఎరుకజెప్పేనమ్మ ఎరుక
ఎరుకడగరోయమ్మ యెరుక
మా మంచి ఎరుక ఎరుక చెప్పేనమ్మ
ఎరుకా, ఎరుకో, ఎరుకా.

చెలి

ఎరుకవ్వా, ఇలా వచ్చేవా ? మా రాణి పిలిచీని.

ఎరుకత

ఎరుకడగతవ తల్లీ ఎరక ? ఎరకచెప్పేగాని వా బుడతడి కింత బువ్వెడతవ అవ్వా.

చెలి

పెట్టేగాని నీ దేవూ రవ్వా ?

ఎరుకత

కొండమీద గోవిందుడుండే రేవపల్లెతల్లి, రేవల్లంటే రేవపల్లెకాదు ఎరుకపల్లే తల్లీ, బుడతడికింత బువ్వెట్టు తల్లీ.

చెలి

గడప మెట్టేవో లేదో బువ్వ బువ్వంటావు, లోనికి రాగదమ్మా ! మా దొరసాని పిలిచీని.

కథకుడు

ఇట్లా ఎరుకత ధారుణీదేవి చెంగటి కేతెంచి ఏమనుచున్నది—

ఎరుకత

అవ్వోయవ్వ! పెద్ద దొరసాని! ఎరక చెప్పే నెరక! ఎర కడగవే యవ్వ! తలచిన తలపు చెప్పేను. మరచిన మాట చెప్పేను. తబ్బిబ్బు కాదు. తాటోటు కాదు. తారకాణ చేసేను.

కథకుడు

అంత ధారుణీదేవి పైడిచేటలో ఆణిముత్యాలు పోయించి, ఎరుకత ముంగల నిడి, గద్దియ చేయంటి ముమ్మారు మ్రొక్కి నా తలపు తెలుపవే అవ్వా' అనినంత ఎరుకత తనచేతి కోల రాణిచేతి కందించి——

ఎరుకత

ఏడుకొండలమీద యెలసినసామి
కంచి వరదరాజ, గరుడాచలయ్యా
సిమ్మాద్రి అప్పన్న శ్రీశైలవాస
యాదగిరి నరసిమ్మ ఆదిలచ్చమ్మ
కనకదురగమతల్లి కదిరి నరసిమ్మ
వుజ్జయిని మాంకాళి వోబలేశయ్యా
కొల్లాపురీ లచిమి కోటిదండాలు
వాకున నిలవరే మీకు మొక్కేను.

అమ్మోయమ్మ! బాగ్గెంగల శెయ్యి, పతిష్టగల శెయ్యి, సంతతిగల శెయ్యి, సల్లని శెయ్యి. ఓ యవ్వ! ఒక్క తలపు తలిసినావు. ఒక్క కోరి కడిగినావు. ఆడోరివంక తలసా, మొగోరివంక తలపా అనేవు. ఇది గిదిగో ఆడోరంటే బొట్టు మొగోరంటే గడ్డం. కన్నబిడ్డకోసం కళవళపడుతుండవ్. అది మనిసో, మానో, దయ్యమో, బూతమో అని అడగతావే అవ్వ. అవ్వోయవ్వ అది మనిసికాదు, మానుగాదు. దయ్యంగాదు. బూతంకాదు.

అవ్వో నీ బొట్టెకు నల్లమొగుడొస్తడే యవ్వ. బొ్రల్లు
డొస్తడే యవ్వ. కొండమీది గోవిందు డొస్తడే యవ్వ. బొడ్డున
తామరపువ్వ, రొమ్మున రతనమాణిక్కెం, సిరిగల్లు డొస్తడే
యవ్వ. నీకోరిక కాయగాదు పండేయవ్వ. అదియెన్నాళ్ళకని
అడగతవే తల్లీ. వొకటి రెండు మూడే యవ్వ. వొకటంటే వొక
ఘెడు గాదు, రెండంటే రెండు నెల్లు గావు, మూడంటే

మూడునాళ్ల గావు. మూడుగడియలే అవ్వ. తారకాణడగతవో
యవ్వ? ఇదు గిదుగో యీదిక్కునుండి ఆడకూతురు మనువడగ
వత్తుండదో యవ్వ. ఇప్పుడే వస్తాదో, ఇకనే వస్తాదో అంటవు ?
ఇప్పుడంటే యీచణాన నీగడపకాడుండదే యవ్వ. నామాట
కల్లగాదు, కపటంగాదు. శీనివాసుడితోడు, యెంకటేసుర్లుతోడు,
ఏడుకొండలవాడితోడు, నా గద్దెబుట్టతోడు. నీ బొట్టె పెళ్లి
కొస్తనే యవ్వ! వొళ్ళో వరాలోసి నన్నంపవో యవ్వ.

కథకుడు

అనుచు నెరుకత వెడలిపోవునంత వకుళమాలికయు ధారుణీదేవి
చెంగటి కేతెంచె నెటువలెను——

సౌరాష్ట్రరాగము – ఆదితాళము

ముందర వచ్చి నిలిచెను ముదుసలి వైష్ణవి ॥ముందర॥
చెందిర తిలకము చెవికమ్మలు, గుర
వెంద పేర్లు గళమందు మెరయగా ॥ముందర॥
ఇందిరేశ అరవిందనయన గో
వింద మాధవ ముకుందా యని (శ్రీ)
మందిరు బాడుచు ॥ముందర॥

కథకుడు

ధారుణీదేవి ఆ వైష్ణవి కెదురేగి తోడ్తెచ్చి, పసిండి గద్దెయందుంచి,
అవ్వా నీవెవ్వరు? నీ వచ్చిన వృత్తాంతం బెట్టిదని యడిగిన—

వకుళమాలిక

వినవమ్మ నా తెంకి వేంకటాచలము
వనజనాభుండైన వైకుంఠు డచట
సిరిబాసి ఒంటి వసించుచునుండి
విరిదోటకడ నిన్న వేటకై వచ్చి
చెలులతోనాడు నీ చిన్నారికూతు
చెలువు కన్నులగాంచి వలచినాడమ్మ !
ఎల్లలోకమ్ముల నేలేటివాడు
చల్లని చూపుల నల్లనివాడు
ఉరమురత్నమ్ముతో ఒరపైనవాడు
కరముల శంఖచక్రము లున్నవాడు
గళమున వనమాల గలవాడు, మరియు
అలరువిల్తుని కడుపార గన్నయ్య
నా యయ్య కంచివరదయ్య రంగయ్య
ఆ యశోదమ్మ కన్నయ్య చిన్నయ్య
మనువడగ నంపె పద్మావతీకన్య
తన కిమ్మటంచు ; నీతనయ భాగ్యమ్ము
నేమందునోయమ్మ. ఇందిరాదేవి
కామించినట్టి చక్కని సామి తానె
వలచినాడమ్మ ! పర్వతరాజతనయ,
పలుకులరాణి రావమ్మ పోవమ్మ
యనగ, వేల్పులు హస్తవనజముల్మొగిచి
వినుతించి పాదవందన మాచరింప

చెలగు నీసుత మేలు చిత్తమందెంచి
తెలిపి నీ పతికి, వార్తల నంపరమ్మ!

సూత్రధారుడు

మూర్తీ! వింటూంటే నాకే నోరూరుతూందికదా. ఆకాశ
రాజుమాత్రం కాదంటాడా?

కథకుడు

ఎందుకంటాడూ. కనకాచలం కాళ్ళదగ్గరకొస్తే? వెంటనే శుక
మహర్షిని రావించి, సుముహూర్తం నిశ్చయించి, శ్రీనివాసుని
చెంత కంపించారు.

సూత్రధారుడు

గట్టివాడే సుమా! కాలికింద పూరి మొలవనివ్వడు. ఇంతకు
సుముహూర్తం ఎప్పుడంటావు? వ్యవధి ఏమాత్రముంది?

కథకుడు

వ్యవధి ఏదండీ. ఈ వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారం రాత్రికే

సూత్రధారుడు

మనంకూడా వెళ్ళాలయ్యా రమణమూర్తీ! ముక్కోటిదేవతలు, సప్త
ఋషులు, బ్రహ్మేంద్రాది దేవతలు వచ్చే ఆ వైభవం కలియుగ
వైకుంఠం కదయ్యా! పాపం, మా ఆ బిడనుకూడా తీసుకెళ్ళాలి.
మళ్ళా ఇటువంటి జగత్కల్యాణం కంటబడదు అన్నట్లు శుక
మహర్షి వెళ్ళినమీదట శ్రీనివాసమూర్తి ఏమన్నారో?

కథకుడు

కల్యాణం ఎదురుగావస్తే అంటానికేముంది? కట్నాలు కానికలు
మాట్లాడుకోవాలి కనుకనా. శుకులవారి నెంతో మర్యాదచేసి
తథాస్తు అలాగే కానివ్వండన్నారు, ఏమి ఎరగనట్లు మే

మానాటికి తర్లివస్తామని గేదగి రేకుమీద గోటితో లగ్నపత్రిక వ్రాయించి పంపారు. ఇంతలోనే వకుళకూడా చక్కావచ్చింది, శ్రీనివాసమూర్తి నమస్కరించగా శోభనపెళ్ళికొడుకువు కమ్మని దీవించింది.

సూత్రధారుడు

భాగ్యమంటే ఆ యమ్మదే భాగ్యమన్నాను కాదూ! ఇంతకూ స్వామివారి పెళ్ళిఖర్చుమాట ఆలోచించారో లేదో

కథకుడు

అదిగో, ఆ సంగతే వకుళతో సంప్రదిస్తున్నారు.

శ్రీనివాసుడు

వకుళా! నీ దయవల్ల కల్యాణం నిశ్చయ మయింది. మరిపెళ్ళికి సొమ్మెక్కడయినా చూచావా? ఆవల వారిది రాజకుటుంబం. వారితో సరితూగకుంటే లోకం నవ్విపోతుంది.

వకుళమాలిక

అయ్యో నాతండ్రీ! నీకేమి తక్కువయిందని? లక్ష్మిఅమ్మవారిని పిలిపిస్తివట్టాయెనా, అన్నీ ఆవిడే దిద్దుకుపోతుంది.

శ్రీనివాసుడు

వెట్టిదానవే వకుళా! ఇదెక్కడైనా కద్దా? సొమ్మిచ్చి సవతిని తెచ్చుకుందురా లోకంలో ఎవరైనా?

వకుళమాలిక

నిజమే నాయనా! మరి నేనేం చేతును? దిక్కుమాలిన దాన్ని నాబిడ్డపెళ్ళికి చేతిలో చిల్లిగవ్వయినా లేదాయె.

శ్రీనివాసుడు

అవ్వా! నాకో ఆలోచన తోస్తున్నది, భూవరాహస్వామినడిగితేనో?

సూత్రధారుడు

మరే. తన సొమ్మంతా కొల్లబోయినట్లు మూరడుగుల నేల ఇచ్చేందుకే అంత వెనుకముందాడిన వరాహస్వామి ఇస్తాడటయ్యా ?

కథకుడు

అలా అనకండి. ఇచ్చేందు కాయనవద్దమట్టు కేముందీ—కొండలూ గొయిపలూ తప్పిస్తే. వకుళ వెళ్ళి అడిగితే, శ్రీనివాసుల కేమిలోపం ? బ్రహ్మేంద్రాదులకు కబురంపితే సర్వం వారే చక్క బెట్టుతారని సలహా యిచ్చాడు.

సూత్రధారుడు

అవునుసుమా. మనకు తోచిందికా దీమాట.

కథకుడు

శ్రీనివాసు డంతట గరుడుని, శేషుని రావించి బ్రహ్మేంద్రాదులకు, కైలాసపతికి శుభలేఖ లంపించారు.

సూత్రధారుడు

ఇక నేం ? పెళ్ళిపెద్దలంతా పెళ్లిమంటూ చక్కా వచ్చారు.

కథకుడు

శ్రీనివాసమూర్తి యంతట మయుణ్ణి పిలిచి, నారాయణవనం అలంకరించవలసిందని సెల విచ్చారు.

సూత్రధారుడు

మయబ్రహ్మ తలుచుకుంటే ఇక తక్కువేముంది ? ఆకాశమంతఅరుగూ, భూమంత పందిరీ వేయించారు.

కథకుడు

మీరు పెళ్ళికి వెళ్లాలనే తొందరలో తడబడుతున్నారు. దేవతలకు గూడా చూడముచ్చటగా అలంకరించా డా నగరం.

ఆనందభైరవి రాగము

ఎచటు చూచిన పూలతోరణ లెందునా ముత్యాలముగ్గులు.

సూత్రధారుడు

ఆగు ఆగు. కస్తూరి కలయంపి మరిచావు.

కథకుడు

ఎందు చూచిన రత్నదీపిక లెందునా నీలంపు టరుగులు.

సూత్రధారుడు

గరుడపచ్చల స్తంభాలు, వెన్నెల చాందినీలు, అబ్బబ్బా! కలియుగ వైకుంఠం కదయ్యా!

కథకుడు

విలువనేగెను చుట్టముల షణ్ముఖుడు సమా
  గతులను మదనుండు గారవించె
వరుణుండు నీళ్ల కావడి భుజమ్మున బూనె
  పాచకత్వమ్మూనె పావకుండు
అనిలుండు గంధమాల్యమ్ములు సమకూర్చె
  ధనదుండు వెచ్చంపుబనులు చూచె
తావలరాయండంత దివియలు వెలిగించె
  సాగించె నింద్రుడచ్చరలమేళ
మొజ్జరిక మూనె నిక్ష్వాకువంశగురుడు
ప్రమథగణము పూరించె శౌర్యత్రికమ్ము
అన్నిటికి దానె యయ్యె పద్మాసనుండు
వకుళ కనుదోయి మోదబాష్పముల వెలిగె

సూత్రధారుడు

చాలుగాని ఇక రావయ్యా! పెళ్ళివారు బయలుదేరే వేళయింది.

కథకుడు

కొంచెం నిదానించండి. హరిని మంగళస్నానానికి రమ్మని శారదా గౌరీపతులు పిలిచినంతట—
భావ మొకతీరుగాగ నిందీవరాక్షు
డశ్రుబిందులు రెప్పల నప్పళించి
దైన్యమున మోము వాంచి,గద్గదిక నల్ల
నల్ల "సిరిలేని పెండ్లి నేనొల్ల" ననియె.

సూత్రధారుడు

ఎట్లాగూ! ఈ మాట ఏమయినా బాగుందా మూర్తీ? తీరా, మంగళ స్నాన సమయానికిలా పేచీ పెట్టితే ఈ ప్రయత్నమంతా ఏమి కావలసింది చెప్పు. అదీకాక, లక్ష్మీదేవికి మొదలే తగని అభిమానం కదా, తగుదునంటూ ఆ ఇల్లాలు సవతి పెళ్లికి పేరంటానికి వస్తుందటయ్యా ?

కథకుడు

మీరు అప్పుడే బెంగపెట్టుకోకండి. లక్ష్మీఅమ్మవారిచెంత కదుగో సూర్యభగవానుణ్ణి పంపుతున్నారు.

సూత్రధారుడు

పెళ్ళికి రమ్మనేనా ?

కథకుడు

ఎబ్బే! శ్రీనివాసమూర్తి ఈమధ్య బొత్తిగా నల్తగాఉన్నారు, మిమ్మొకసారి చూడాలంటున్నారని చెప్పి తోడుక రమ్మన్నారు.

సూత్రధారుడు

అలా చెప్పు. ఆ జాలిగుండెలతల్లి వచ్చితీరుతుంది, ఏమంటావ్ ?

కథకుడు

వచ్చారండీ, అమ్మవారు. అట్లుచనుదెంచిన శ్రీదేవికి కేళవుండెదురేగి తోడ్తెచ్చి, చెంత నుంచుకొని, కొంత తడవిష్టగోష్ఠి నడపి, పిదప

శ్రీహరి బ్రహ్మేంద్రాదులం జూపి
సరసిజాసను డాదివేల్పులు సాధ్వి! నాకిటు వెండియున్
పరిణయము తలపెట్టినంతట, వలదు నాకిపు డీ పునః
పరిణయం బని ఎన్ని చెప్పిన వార లన్నిటి కన్నియున్
దిరుగ జెప్పుదు; రేను నిన్ గొనితేరనంపితి నెచ్చెలీ!

లక్ష్మి

ఔ లెండు. మీర లీ యఖిలకుటుంబకు
లిల్లాలు లేకున్న నెట్లు గడచు?

శ్రీనివాసుడు

చతురభామిని వౌదు చాలింపు మీ యెల్లి
దములు నా కిందిరాతరుణి లేదె?

లక్ష్మి

ఉన్నది లే దటులుండనిం, డింత కా
సుదతి పేరడుగవచ్చునో కో నాకు

శ్రీనివాసుడు

మానవుగా పోటుమాట, లా తన్వి పే
రేమియౌగాక నాకేమి వలయు?

లక్ష్మి

ఏను వినగూడదేమొ పోనిండు నాథ!

శ్రీనివాసుడు

ఇందిరా! ఇందుదాచుట కేమి కలదు.
అల్ల ఆకాశరాజకన్యక, సహస్ర
దళకనకపద్మమందు భూధవున కొదవె.

లక్ష్మి

ఏమయ్యా, పద్మసంభవా! పేరుచెప్పుటకు మీ అయ్యా సంశ
యిస్తున్నారు; నీవైనా చెప్పరాదా?

బ్రహ్మ

తల్లీ! వారు చెప్పనే చెప్పారు. ఆయమ్మ పేరు పద్మావతి.

లక్ష్మి

పద్మావతి! ఎంత చక్కని పేరు! నాథా! ఇంకా సంశయ మెందుకు?

శ్రీనివాసుడు

ఇందిరా! నిత్యానపాయిని వీవు గల్గగ నాకు నీ
సుందరీమణి యేల? తొల్లిటి సుద్దు లీవు నెఱుంగవే?

లక్ష్మి

ఎందుఁ కు గోవింద! నా కడ నింత దాపరికమ్ము, కా
దందుననిగా, కల్ల వార్తల నంపినా వవనీధవా!

కేదారగౌళ రాగము–ఆదితాళము

ఎన్న డేని మీ కెదురాడినదా ఇందిర గోవిందా!
ఇన్నినాళ్ళు సేవించిన సతిపై ఏమిటి కీనిందా?
కన్నెమీద మనసున్న దేని నే కాదందున? శుభమందునయా!
వన్నెవాసి మునుగన్న వారిపుడు విన్నవారు నేమందురయా?

శ్రీనివాసుడు

కోరికోరి సవతాలి భర్తలకు గూర్తురే సుదతులెందు రమా?

లక్ష్మి

వేరవేర ఆల్మగ లొండొరులను వీడియుందురా, త్రివిక్రమా?

శ్రీనివాసుడు

చాలుచాలు, పదివేల కీమను విదేల విడంబన మో లలనా!

లక్ష్మి

మేలు మేలు సిరియావ! పెండిలికి మేకొనకున్న రమారమణా!

శహానరాగము—ఝంపెతాళము

ఒంటివై యీ మెట్ట నుంటి విన్నాళ్లీవు
తింటివో పస్తులేయుంటివో నాథ! వా
ల్గంటి చేపట్టి ఒక యింటివా డగుము, చే
యంటి సరియంటి, తిగకంటి దొర సాక్షిగా.

శ్రీనివాసుడు

కానిమ్ము నీ వింతగా చలపట్టితే
ఏను కాదననేల? ఇదిరా! నా హృదయ
మందిరవు నీ వెరుగ కుందువే? పేరు గో
విందునిది, మేలుకీ ల్గిందిరవి సకలమ్ము.

సూత్రధారుడు

ఓహోహో! ఎంత బెట్టు చేసారయ్యా స్వామివారు! ఇంతకు ఓర్పంటే అమ్మవారిదే ఓర్పు.

కథకుడు

వారి దంతా అదో దివ్యలీల. చూచి ఆనందించడమే మనవంతు. అదిగో అమ్మవారే గోవిందుని పెండ్లికొడుకును చేస్తున్నది కన్నీటితో. అది ఆనందమో, దుఃఖమో! అరుంధతీ గౌరీ సరస్వతులు మంగళారతు లిస్తున్నారు.

నీలాంబరిరాగము—ఆదితాళము

శ్రీలలనా హృత్కమనా లాలి సనాతన విగుణా!
హరిదయాకరనయనా క్షీరపయోనిధిశయనా ॥ శ్రీలలనా ॥

కథకుడు

అంతట వకుళమాలిక తెచ్చియిచ్చిన మంగళద్రవ్యములచే సిరి హరి నలంకరింపగా, వసిష్ఠులవారు పుణ్యాహవాచనాదు లాచరింపజేసి, కులదేవతయగు శమీవృక్షశాఖం బూజించి భూవరాహస్వామి చెంత ముత్యాలత్రోవపై నద్దాని నిలువం జేసినంతట శ్రీహరి భూవరాహదేవునితో నేమవి పల్కుచున్నారు—

అన్నా! వరాహదేవా! ఈ పెండ్లికి మీరే పెద్దలై, భూదేవీసమేతంగా విజయంచేసి మమ్ము ఆశీర్వదించాలి.

వరాహదేవుడు

శుభం. నాయనా! నీవొక యింటివాడవు కావడం సంతోషం. మరి, ఇక్కడ ఈ క్షేత్రమంతా పంటముఖం తిరిగిఉంది. కనుక ఇల్లు కదలటం పడదు. నామారుగా వకుళయే ఉంది అన్నిటికీ.

కథకుడు

పిమ్మట శ్రీహరి హరిహరవిరించులతో నొక అశ్వత్థవృక్షమ్ము చెంత ఏకాంతముండి కుబేరు నటకు రావించి, ఏమనుచున్నారు—

శ్రీనివాసుడు

రావయ్యా! ధనపతీ! నీతో పనిగలిగి రావించాం.

కుబేరుడు

దేవర ఆజ్ఞ యిప్పించండి సేవకునకు.

శ్రీనివాసుడు

పెళ్లి వివాహం కదా, నీకు తెలియని దేముంది? శ్రీదేవిని సొమ్మడగటం భావ్యంకాదు. ఈ అక్కర నీవు గడపితే నీకు పత్రం వ్రాసి యిస్తాము.

కుబేరుడు

హరిహరీ! ఎంతమాట సెలవిచ్చారు! ఈ దాసుని సంపదంతా దేవర అధీనం. నాకు పత్రమెందుకు? కావలసినసొమ్ము సమర్పించుకుంటాను.

బ్రహ్మ

కుబేరా! స్వామి నీవల్ల దానం గ్రహించరుకదా! వారి ఆజ్ఞపాలించడమే మన వంతు.

కథకుడు

అని కుబేరు నంగీకరింపజేసి శ్రీనివాసహస్తలిఖితంబగు ఋణపత్రంబు చతుర్ముఖుండు చదివి వినిపించె నెటువలెను—

బ్రహ్మ

స్వస్తి. శ్రీమదష్టావింశద్వాపరాంత కలియుగాది శేషాచలంబుపై వేంచేసియున్న వేంకటనాయకుండు అలకాధిపతియైన కుబేరునకు వ్రాసియిచ్చిన వడ్డిపత్ర మెటువలెను. ఎల్లి మా వివాహానికి నీవల్ల అప్పుగాగొన్న రామటంకాలుకోటి పదునాల్గు లక్షలు. ఇందుకు ఏటేటా సహస్రటంకాలు వడ్డీయిస్తూ, కలియుగాంతమున మొదలు సర్వము ఇవ్వగల వారము. ఇది మా సమ్మతి. ఇందుకు అజహరులు సాక్షులు. ఈ యశ్వత్థమ్ము సాక్షి.

కథకుడు

పిమ్మట నా పత్రమ్ము హరునిచే కుబేరున కిప్పించి, ఆ సొమ్ముతో వలసిన పదార్థములు తెప్పింపు మనినంత—

సూత్రధారుడు

ఇదటయ్యా కథా! చెప్పేవుకావు? ఇందుకోసమేనా స్వామివారు వడ్డికాసులు వాబళ్లైది?



కథకుడు

ఔను. వారు జగత్కుటుంబకులు కారుటండీ, లక్ష్మీసంపద కంతటికీ దాతా భోక్తా కూడా స్వామివారే, అనాటిచేయు భూరిసంతర్పణమ్ము గావించి—

సూత్రధారుడు

అరె నీ యక్షగానం అక్షయంకానూ! సంతర్పణవేళ కూడా తప్పించావూ?

కథకుడు

అయ్యో తొందరా? రేపటినుంచీ విశ్వమంతటికీ సంతర్పణే కాదటండీ! ఆ వేళవనే విష్వక్సేనుండు ప్రయాణభేరి వేయించినంతట—

సూత్రధారుడు

ఇక చాలుగాని నారాయణవనం ఇంతటనైనా చేరుకుందాం పదవయ్యా!

కథకుడు

అచట పద్మావతీకన్యను పెండ్లికూతు గావించి గౌరిని సమర్చింప జేసినపిమ్మట—

సురటరాగము—మిశ్రగతి

కోమరుగా నిరుగడల రమణులు కొలిచిరాగా రాకుమారిక
సమదగజయానమున పెండిలి చవికె కేతెంచె. ॥ కోమరుగా ॥

సూత్రధారుడు

ఆహాహా! కన్నులుగలిగిన ఫలం, మిన్నుమన్నులకు బుట్టిన కన్య, సన్నని కాటుకరేఖ అద్దిన చేరెడేసి ఆ సోగకన్నుల నుండి చిరు

నవ్వు, లేతసిగ్గు వెల్లువ లవుతున్నవి కదయ్యా! ఆ తల్లి పెళ్ళిపీటపై అడుగు పెట్టితే మహామాంగల్యం ఏదో భూమిపై అవతరించి నట్లుందయ్యా!

కథకుడు

అరుగో వసిష్ఠులవారు.

వసిష్ఠులవారు

సర్వమంగళమాంగళ్యే.... అయం ముహూర్తస్సుముహూర్తోస్తు.

కథకుడు

ముత్తైదువలు కూర్చున్న ముందువరుసలో గౌరీసరస్వతుల మధ్య, బంగారుపీటపై, చెక్కిట చేయూని కూర్చుంది లక్ష్మీఅమ్మవారు, చూచారా?

సూత్రధారుడు

అవునవును. అది సంతోషమో, సంతాపమో కాని, ఆ తల్లిచెక్కిళ్లు క్షణం తెల్లదామరలు. క్షణం మంకెనపూలు పూస్తున్నవి.

కథకుడు

పెళ్ళికూతురు వెనుకగా అరుంధతీదేవి—

సూత్రధారుడు

పెండ్లికుమారుడి వెనుక వకుళమాలికా — చూస్తున్నానయ్యా, చూస్తున్నాను.

వసిష్ఠులవారు

మదర్థం కన్యాం వృణీధ్వం

బ్రహ్మ

వృణీమహే

వసిష్ఠులవారు

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకాయ, వేంకటాచల నివాసాయ, వరాయ. ఆకాశరాజపుత్రీం, పద్మావతీనామ్నీం, కన్యాం. దశ పూర్వేషాం, దశాపరేషాం, మధ్యంశ్యానాం, బ్రహ్మలోకే నివాస సిద్ధ్యర్థం – కన్యాం కనకసంపన్నాం, దాస్యామి విష్ణవే తుభ్యం – ధర్మార్థకామేషు నాతి చరితవ్యా.

శ్రీనివాసుడు

నాతిచరామి.

సూత్రధారుడు

నాతిచరామిఅనే ఈ ప్రతిజ్ఞ ఇప్పటి కెన్నిసార్లు చేసారో స్వామి!

కథకుడు

అవును. చరాచరేశ్వరుడైన స్వామి ఎవరిని చెట్టబట్టినా మరి వదలరు. ఆ బాహుబంధంలో ఎందరికైనా చోటు ఉండనే ఉంటుంది. సమస్తజగత్తును తనబాహువుల్లోకి తీసుకుందుకేకదా, ఈ ఏడు కొండలెక్కి చేరబిలుస్తున్నారు.

సూత్రధారుడు

అదిగో! వధూవరులు తలంబ్రాలు పోసుకుంటున్నారు.

సైంధవిరాగము-ఆదితాళము

కరివేల్పు పెండ్లికొడుకాయెను అల
మేల్మంగ పెండ్లికూతురాయెను ॥ కరివేల్పు ॥

ముత్యాలు వానలై జారెను ఆణి
ముత్యాలు తరగలై లేచెను ॥ కరివేల్పు ॥

హరికరము లవనికై జాచెను పద్మ
కైదోయి మింటికై సాగెను ॥ కరివేల్పు ॥

మినుమన్ను దోసిళ్లు కూడెను మనసు
లినుమిక్కి లేతాములాడెను ॥ కరివేల్పు ॥

వసిష్ఠులవారు

అష్టవర్షా భవేత్కన్యా పుత్రవత్పాలితామయా—

సూత్రధారుడు

లక్ష్మీఅమ్మవారు పద్మావతిని తనకౌగిటిలోకి తీసికొని, ఆ తల్లి శిరస్సుపై బొటబొట కన్నీరు కారుస్తున్నది ఏదీ! మంగళ హారతి అనండమ్మా,

ఆనందభైరవిరాగము - జంపెతాళము

మంగళం బలమేలుమంగాసమేతునకు
మంగళం శేషగిరిమందిరునకు ॥ మంగళం ॥

ఏడుకొండల విడిసి ఈరేడులోకాల
నేలుకొను కరిమేని వేలుపునకు ॥ మంగళం ॥

నలువసేవలుగొనే నాతండ్రి కానంద
నిలయ దివ్యవిమాన కలితునకును ॥ మంగళం

కలి తమోహారణ మంగళదీపికాయితో
జ్వాలరత్నమకుటరుచి విలసితునకు— ॥ మంగళం

( గుడిగంటలు )

స్వస్తి

---